# చేనేత ప్రాముఖ్యము

శ్రీ పెండెం వెంకట్రాములుగారు,
ప్రధానకార్యదర్శి,
ఆంధ్రరాష్ట్ర చేనేతపారిశ్రామికసంఘము.

భారతదేశమునందలి గ్రామపరిశ్రమలలో చేనేతపరిశ్రమ చాలముఖ్యమైనది, గృహపరిశ్రమ అన్నిటిలో ప్రధానముగను, వ్యవసాయమునకు తరువాత రెండవదిగనున్నదీచేనేతపరిశ్రమ. బట్టల మిల్లులుత్పత్తి గానికాలమునందు షుమారు ౧౫౦ సం. క్రిందటివరకు భారతదేశమునందు తయారగుచున్న చేనేతవస్త్రములకు చాలగిరాకియుండెడిది. అనాడు భారతదేశమునందు ఒకకోటి చేమగ్గముల ండెడివి. వీనిపైనాలుగు కోట్లప్రజలకుపని, జీవనముగలుగుచుండెడిది. నాలుగుకోట్లరాట్నములుగూడనుండెడివి. నూలునకురంగులద్దెడివారు బట్టలకు కలంకారీలద్దువారు, నూలువడుకువారు, బట్టలునేయువారు, నూలు బట్టలువాణిజ్యముజేయుచున్నగు తరగతులవారు దాదాపు పదికోట్ల మందిప్రజలకు భారతదేశమునందుగల చేనేతపరిశ్రమపనినిగలిగించుచుండెను. భారతదేశతంతునిర్మాతలు, వస్త్రనిర్మాణకులు ప్రపంచపుఅద్భుతాలలోనొకరుగా పరిగణింపబడుచుండెడివారు. రాటముమీద నాలుగైదువందలనంబరువరకును, తక్లీలమీద వెయ్యినంబరువరకు నూలుతీసి ఆ నూలుతో వస్త్రములునేసియిచ్చుచుండెడివారు. ఇట్టిప్రశస్తమగు భారతచేనేతపరిశ్రమ ఈనాడుజీవచ్ఛవమువలెగనుపించుచున్నది.

### మిల్లులపోటీ

ఇంగ్లాండుదేశమునందు ౧౫౦ సం. క్రిందటబట్టలమిల్లులుప్రారంభమైయుండెను. ఈమిల్లుబట్టలవ్యాపారము పరదేశములన్నిటి నాక్రమించి క్రీ-శ-౧౮౧౫ సం-భారతదేశమునకుగూడ దిగుమతియైక్రమక్రమముగా పెరిగియుండెను క్రీ-శ-౧౮౭౦ సం,నాటికి విదేశములనుండి దిగుమతియగువస్త్రములు సం.కి ౩౦కోట్లరూపాయలకు పైగా పెరిగియుండెను. క్రీ-శ- ౧౮౮౫ సం. నుండి భారతదేశమునందుకూడ బట్టలునేయుమిల్లులు ప్రారంభమైయుండెను. ఈనాటికి భారతదేశమునందు బట్టలమిల్లులు ౪౫౦ గలవు. ఇందులో ౨౦౭ మిల్లులురాత్రింబవళ్లును, మిగతమిల్లులు పగటిపూటను పనిచేయుచున్నవి. ౧౯౩౦ సంవత్సరంనుండి విదేశమిల్లుబట్టల దిగుమ క్రమక్రమముగాతగ్గిస్వదేశీ మిల్లుబట్టలవ్యాపారము విపరీతముగా పెరిగినది భారతదేశమునందు సం-౧-కి ౬-౨౦ కోట్లగజములవస్త్రములు ఖర్చుఅగుచున్నవి ఇందులో ౪-౨౦ కోట్లగజములు చేనేతవస్త్రములు, ౬౦ కోట్లగజములు విదేశములనుండి దిగుమతియైఖర్చగుచున్నవి. ఇండియాదేశమునుండి పరదేశములకు -౨ కోట్లగజాల చేనేతవస్త్రములుఎగుమతి యగుచున్నవి.

౧౫౦ సంవత్సరములక్రిందట భారతదేశమునకుగావలసినవస్త్రములన్ని భారతచేనేతమగ్గములమీద తయారగుచుండెను. పైగా చేతిమగ్గములమీద దేశమునకుపోను నాలుగవపాలు అధికముగాతయారుజేసి విదేశములకుగూడ నెగుమతిచేయుచుండిరి. అట్టిచేనేతపరిశ్రమనేడు స్వదేశీవిదేశీమిల్లులపోటీవలన పూర్తిగనీరసించినది. ఈనాడుభారతదేశమునగల చేతిమగ్గములు ౨౫ లక్షలుమాత్రము. అనగామూడువంతులు నశించినవి, వీనిపై ఒకకోటుమంది ఆధారపడియున్నారు ౨౫ లక్షలమగ్గములమీదవచ్చు ఆదాయము ౨౫ లక్షలమందికి చాలిచాలనంతఆదాయము వచ్చుచున్నది అనగా ఒకమగ్గమునకు ఒకకుటుంబము ఆధారపడియున్నది. సాధారణముగా ఓచేమగ్గముజరుగవలెనంటె యిరువురు పనిజేయవలసియున్నది. ఇందులకుఒకమగ్గముమీద గిట్టుబడాయము నాలుగణాలుగూడలేదు. ఇందుచేతఈపారిశ్రామికులు ఆర్థికముగా పొందరానికష్టములు పొందుచున్నారు. నేడు కష్టములుపొందుభారతీయులలో ప్రథమముగా చేనేతపారిశ్రామికులను చెలుపవలసియున్నది.

### ఇతరకష్టములు

ఈపరిశ్రమకు మిల్లులపోటీగాక మరికొన్నికష్టములుగలవు. చేనేతవస్త్రములునేయుచు వ్యాపారులతిరులో తాముపోటీచేసుకొని వస్త్రముల ధరలుతగ్గించి ఆతగ్గుదలను పారిశ్రామికులకూలి నుండి తగ్గించుచుందురు ఇందువలన ఒకరూపాయిగిట్టవలసినకూలిక్రింద నాలుగణాలుగూడ గిట్టుటలేదు. ఇంతేగాక ఈమగ్గములకుగావలసిన నూలును మిల్లులవద్దనుండి వ్యాపారస్థులుగుత్తగాకొని తమయిష్టమువచ్చినట్లు లాభములతో విక్రయించుచుందురు మిల్లులవారు వ్యాపారస్థులు ఏకమై నూలుసరలను తమయిష్టమువచ్చినరీతిని ధరలు నిలకడలేకుండా చేయుచున్నారు. ఈ నూలుఅద్దు రంగులు పూర్వము మనదేశమునందు తయారగుచుండెను. ఈనాడు పూర్తిగ విదేశపు రంగులమీద ఆధారపడవలసి వచ్చినది. ఇన్నికారణములచేత చేనేత పరిశ్రమ స్వశక్తిలేనిదై దీనావస్థలోనున్నది.

### చేనేత ఉద్ధరణ యత్నాలు

౧౯౦౯సం. క్రిందట మద్రాసు కౌన్సిలరస్థులు సర్ పిట్టిత్యాగరాయశెట్టిగారు చేనేతపరిశ్రమకు శ్రేష్ఠి కొంత పంచలనము ప్రారంభించి మద్రాసు ప్రభుత్వముద్వార కొన్నికార్యములు సాగింపబడియుండెను. అప్పుడు పయిషటల్ అను మగ్గమువారిద్వార ప్రాపకమునకువచ్చినది. ఈకార్యవిధానమును ౧౯౧౦సం. అప్పటిఇండియా కార్యదర్శిగారైన లార్డుమార్లే రద్దుచేయుటచేత ఆవిధానము రద్దుగావింపబడినది. అటుతరువాత౧౯౨౮ సం.యన్.జి.రంగాగారు "దక్షిణభారతదేశచేనేత సంఘము" అనుపేర ఒకసంస్థను ప్రారంభించి కొంతసేవనుజేసియుండిరి. శ్రీరంగాగారిసేవను చేనేతపారిశ్రామికులు గుర్తింపలేకపోయిరి. శ్రీవారు "చేనేతఆర్థికము" అను ఇంగ్లీషుగ్రంథము రచించియున్నారు.

౧౯౨౨ సం. యిండియాగవర్నమెంటు పక్షమున విచారణగావింపబడెను. ఈటారీపు బోర్డు నిర్ణయములు, సలహాలు, కేంద్ర ప్రభుత్వమువారు అమలుజరిగింపలేదు. పైగా చేతిమగ్గములకు చవకగాగిట్టుచున్నది విదేశనూలుపై ౧౦౦కి రూ౩౦లవరకు దిగుమతిపన్ను విధించియుండిరి ఇందువలన నూలుప్రియమగుటచేత ౧౯౨౭ సం.నుండి చేనేతపారిశ్రామికులకు గిట్టుచున్నకూలీలు ౧౦౦కి ౨౫ రూ॥వరకు తగ్గిపోయినది.

### చేనేత సంఘాలు

౧౯౧౭సం.వరకు భారతదేశమునగల చేనేతపారిశ్రామికులపక్షమున పనిజేయగల బాధ్యతగల సంఘములేకుండెను. ౧౯౧౫సం. నుండి గాంధి మహాత్ముడు, ౧౯౨౦సం.నుండి కాంగ్రెసువారు ఒకఖద్దరుపస్త్రవ్యాపారమునకు మాత్రము రక్షణను చూపుచుండిరి. మిగతమగ్గముల గతి విచారించువారేలేకుండిరి. ౧౯౩౬సం "ఆంధ్రరాష్ట్రచేనేత పారిశ్రామికసంఘము" పేర నొక సంఘము నేర్పాటుజేసి ఆందోళనప్రారంభింపబడినది. అటుతరువాత కర్నాటక(మరాట, బొంబై, ఉత్కళమున్నగురాష్ట్రసంఘములు; మైసూరు నైజాంస్టేటు సంఘములేర్పడినవి వీరిశక్తికొలది సేవను చేయుచున్నారు.

క్రీ.శ. ౧౯౩౭సం, మద్రాసులోగల కాంగ్రెసుమంత్రులు చేనేతపరిశ్రమ రక్షణకొరకు ఒకనివేదికనుతయారుజేసి మిగతాపదిరాష్ట్రముల అంగీకారమునుపొంది కేంద్రప్రభుత్వమునకందియుండిరి. అక్కడనుండి కేంద్ర ప్రభుత్వమువారు బాధ్యతతో పనిజేయుచున్నారు.

### విచారణ సంఘము-

ప్రస్తుతము యిండియా ప్రభుత్వముపక్షమున కొంతపనిజరుగుచున్న ది౬-౧౨-౧౯౪౦ తేదీ॥ ఢిల్లీలో చేనేతపరిశ్రమరక్షణగూర్చి ఒకసభను కేంద్రప్రభుత్వమువారు జరిగించియున్నారు, ఆసభలో ఒకవిచారణసంఘము నేర్పాటుచేయుచున్నారు. ఆవిచారణసంఘమువారు ఇండియాయంతటతిరుగుచున్నారు, ఈవిచారణ సంఘమువారు తొమ్మిదిమాసములుపనిజేయుదురు వీరుఢిల్లీలోగల వీరిఆఫీసులోనుందురు వీరుప్రభుత్వమువారికి నివేదించువివరములమీద చేనేతజీవిత మాధారపడియుండును. ఇందులకుప్రతిరాష్ట్రమువారు సభలజేసి వాటిద్వారా ఈవిచారణసంఘమువారికి తమతమ కష్టములను తెలియజేయుట చాలఅవసరము-

### చేనేత పారిశ్రామికులకోర్కెలు

చేనేతపరిశ్రామికులు తమ మగ్గములమీద నేయురకములకు మిల్లులపోటు యుండరాదు. వీరునేయుగుడ్డల గజములమినహాయించి మిగతగుడ్డను మిల్లులలోతయారుజేయవలెను. అనగాదానిని కోటాపద్ధతియందురు, ఈకోటాపద్ధతిప్రకారము చేతిమగ్గములమీదతయారగురకములు వారుచేయగలగుడ్డను మినహాయించుటయగును. ఇంతేగాకవీరికికావలసినసూలు క్రమముగ వెలకుదొరకవలెను వీరుతయారుజేయువస్త్రములకు వ్యాపారులపోటీలేకుండా అయా ప్రభుత్వముల బాధ్యతరక్షణయుండవలెను, ఇందులకుగావలసీ నధనమును ప్రభుత్వము పెట్టుబడి పెట్టవలెను. అన్నిటికన్న ముఖ్యమైనది మగ్గము ఒకటింటికి ఒకదినమునకుఎనిమిదిలేకతొమ్మిదిగంటలసేపు పనిజేసినయెడల ఒకరూపాయకుతక్కువలేకుండా గిట్టవలెను, నేతపారిశ్రామికులకనీసపుకోర్కె-

---

# బ్రిటిషు విజయములో అచంచల విశ్వాసము

## బ్రిటిషుసామ్రాగ్రి నౌకలకు జర్మను యుబోట్ల బాధలు

### బ్రిటిషు ప్రధాని ఉపన్యాసము

మార్చి ౧౫వ తేది శనివారంనాడు రూజావెల్టు గారుగావించిన "చారిత్రిక ప్రసిద్ధ్యర్హమగు ప్రకటన"కు బ్రిటిషుజాతి కృతజ్ఞతను బ్రిటిషు ప్రభుత్వప్రధాని చర్చిల్ గారు మార్చి ౧౭వ తేదిన ఒక యాత్రికులవిందులో బహిరంగముగా ప్రకటించిరి.

"అట్లాంటిక్ సముద్రంమీదుగా మాకు చేరిన గంభీరమైన రూజ్వెల్టుగారి వచనములు ధైర్యమును దృఢవిశ్వాసమును ఉదయింపచేసినవి" అని చర్చిల్ గారనిరి.

మానవలోకము ఇదివరకు ఎన్నడునుఅనుభవించనట్టి పరిస్థితులలో, ఇదివరకెన్నడు అనుభవించనంతటి విపరీతమునకు నిలువగలిగినట్టి ఒకప్రజయెదుటికి మీరువచ్చినారని చర్చిల్ గారు వినాంట్ గారికి జ్ఞాపకపరచిరి. "మాలోపారబాట్లున్నవికాని దైవసహాయమువల్ల మేము స్వాతంత్ర్యనిర్మాతము మీద ఆధారపడినట్టి ఒకసామ్రాజ్యమువిన్నిదెబ్బలకైనను తట్టుకుని, గౌరవముతోను, ప్రఖ్యాతితోను, జీవించగలశక్తియున్నదని రుజువుచేయగలమను విశ్వాసము మాకున్నది."

చర్చిల్ గారు ఇంకను ఇట్లు చెప్పిరి:—

"అమెరికా ప్రభుత్వమున్ను, ప్రజలున్ను ప్రకటించిన ఆశయాలు విఫలంకాకుండావుండుటకు అట్లాంటిక్ యుద్ధముపూర్తి విజయముపొందవలెను. జర్మనుల యుబోట్లుమా త్రమేకాక యుద్ధనౌకలుకూడా అట్లాంటిక్ సముద్రందాటినవి. యుద్ధనౌకలరక్షణలేకుండ ప్రయాణము చేయుచున్న రూఓడలలో కొన్నిటిని ముంచివేసినవి పశ్చిమదిక్కునకు ౨౬వ మెరిడియన్ లాంజిట్యూడ్ వరకుకూడ మాఓడలనుముంచినవి. ఇక్కడికిమందుగుండు సామగ్రులు, ఆహారపదార్థాలునిరాటంకముగాతెచ్చుటకు తీవ్రమైనపోరాటముజరుగుచున్నది. అదిలేకుండామేముఇక్కడను, మధ్యప్రాచ్యభాగంలోను, మాయుద్ధప్రయత్నాలను సాగింపజాలము. వాటినివిడచిపెట్టుటకువీలులేదు, మాకుఇప్పుడుఎక్కువనష్టాలుకలిగినవి.

ఈనష్టాలనువూడ్చుటకు మాసర్వశక్తులతోసాధనసంపత్తిని, సైన్యమునువినియోగించుచున్నాము, మాబలము ప్రతివారము పెరుగుచున్నది. శరత్కాలంలోను శీతకాలంలోను, మాకుచేరినఅమెరికా డిస్ట్రాయర్లుఅంతకంతకు ఎక్కువగాయుద్ధములో నుపయోగపడుచున్నాయి. మానౌకలుఅధికసంఖ్యగాపెరుగుచున్నవి. మాద్వీపముమీదను, సముద్రాలమీదను, మావిమానబలముఅతిత్వరగా పెరుగుచున్నది. శత్రువుపైమేముఅంతకంతకు ఎక్కువగట్టిదెబ్బలు కొట్టుచున్నాము. మాదుజర్మను యూ—బోట్లునిశ్చయముగా నాశనంచేయబడినట్లువార్త విన్నటి రోజునసే నాకుచేరినది,

"ఇప్పుడుమమ్ము ఎదుర్కొన్న ఉపద్రవమును మేముదాచిపెట్టుటలేదు. కాబట్టిదీనినిమేము జయములోదాటగలమని విశ్వాసమున్నట్లు నేను ప్రకటించినపుడు, నామాటనువిశ్వసించవలెను, హిట్లరున్నూ, అతనిపక్షపువారున్నూ, బ్రిటనుకు, అమెరికాకుమధ్యసముద్రమార్గాలను తెగగొట్టుటకుఈరెండుబలమైన రాజ్యలను విడదీసినతరువాత వాటినిఒకదానితరువాత ఒకదానిని నాశనముచేయుటకును ఎంతఆతురపడుచున్నారో పునమే ఈఅట్లాంటిక్ యుద్ధంప్రపంచచరిత్రలో ఇదివరకుజరిగినయుద్ధాలన్నిటికంటె ఎంతోముఖ్యమైనది' నిరాయుధమైన వాణిజ్య నౌకను జర్మను యు. బోటు ముంచివేస్తున్న దృశ్యము

"కాబట్టి వినాంట్ గారూ, మీరు ఇప్పుడు ప్రపంచచరిత్రలో ఒకమహాసంధిగ్ధసమయంలో ఇక్కడికివచ్చినారు, గడచినకొద్దినెలలలో ఎందరో అమెరికాప్రముఖులు ఒకరితర్వాతఒకరువచ్చి ఈభీభత్సముద్రతీరాలను దర్శించుచున్నారు—ఇవిఅశేషమైనవని తెలుసుకొనుచున్నారు—వీరుఅందరును ప్రపంచమును కిరాతకత్వములో ముంచివేయుటనూచుచు పూరుకొనుటకంటె అతనిని కాపాడుటకు తమప్రాణాలను అర్పించుటకైన నుసంసిద్ధులగుటయే మంచిదనితలచినారు—రాయబారిగావచ్చిన మీరును ఆదర్శముచే పంచుకొన్నారు—

#### బ్రిటిషు రాజుగారి సందేశము

రాజుగారినుండి వచ్చిన సందేశము చదువబడెను "మనఉభయదేశాలచరిత్రలో ఒకమహావిషమసమయములో క్రొత్తరాయబారి వచ్చినాడు. నేటికిమను మాఅందరిమనస్సులలోను అన్నిటికంటె బలముగావున్న భావములను, అతడు ప్రాతినిధ్యంవహించిన ప్రజలపట్ల మాకృతజ్ఞతను వారందరికీ ధిపతిగావున్న గొప్ప రాజనీతిజ్ఞునిపట్ల మాప్రశంసను మేము ఈక్రొత్తరాయబారికిచ్చిన సన్మానమే రుజువుచేయుచు" అని ఆసందేశములో నుండెను

#### వినాంటుగారి ప్రసంగము

జాన్ వినాంట్ క్రొత్తరాయబారిగా నియమితుడైనతరువాత మొట్టమొదటిసారి బహిరంగప్రసంగముచేయుట బ్రిటను అమెరికాదేశాలురెండునుకలిసి, "మునుపటికంటె సౌఖ్యమైనట్టి ఒకనూతనప్రపంచ నిర్మాణమునకై అన్యోన్యసహాయముతో ప్రయత్నించుటకు తనశక్తి వినియోగించగలదనిరి.

వినాంటుగారు అమెరికా సహాయమును వాగ్దానంచేయుచు రూజువెల్టుగారుచేసిన వాగ్దానాలను పునరుద్ఘాటించెను.

## యం. యస్. ఆనీగారి క్రొత్తరాజకీయపక్ష స్థాపనాలోచన

యం.యస్ ఆనీగారు ఇప్రుడుతాము సభానంగాఉండే కాంగ్రెసు నేషనలిస్టుపార్టీని, ఆలిండియాహిందూలీగును తుంగల్లోత్రొక్కి వేరహిందువులు, ముసల్మానులు, సిక్కులు అందరూ కలిసి నిజమైనప్రభుత్వాధికారాన్ని సంపుకొని పరిపాలనసాగించునట్లుచేయుటకై ఇప్పుడుండే యిండియాప్రభుత్వముమీద ఒత్తిడిచేయునుద్దేశ్యముగల ఒకక్రొత్త—ఖిలభారత రాజకీయపక్షాన్ని స్థాపించుటకై పండితమాలవ్యాగారి వడుగుచున్నట్లు "శ్రీప్రెస్ జనరలు"యొక్క క్రొత్తఢిల్లీవిలేఖరికి తెలియుచున్నది.

## హైదరాబాదు ప్రజాక్షేమ నియమావళిక్రింద చర్య

హైదరాబాదు (దక్కను), మార్చి ౨౨

హైదరాబాదు ప్రజాక్షేమనియమావళిలోని ౩౪వదఫాక్రింద హైదరాబాదునగర ప్రధాన ఫౌజ్దారీ న్యాయాధికారి గులాంపంజతన్ గారి సముఖంలో మదన్నపేట ఆర్యసమాజ కార్యదర్శి నాగభూషణ్ గారిపై నేరముమోపబడినది— నిందితుడు పోయినజనవరిలో జరిగిన ఆర్యసమాజములో జరిగిన నాగసభలో ఒకఉర్దూపద్యము చదివెననియు, దానిలోఆక్షేపణీయములైన భాగాలుండెననియు పోలీసువారివాదము— నిందితుని వకీలు కోరికపై విచారణ ఏప్రిలు౫వ తేదివాటికి వాయిదా వేయబడినది—

నాగభూషణ్ గారు జమానతుపై విడుదల చేయబడినారు—

#### దక్కన్ బుక్ డిపో—అభియోగము

హైదరాబాదు ప్రజాక్షేమ నియమావళిలోని ౨౫వదఫాక్రింద ఇదివరలో హిందూబుక్ డిపో అనబడుచు ఇపుడు దక్కన్ బుకుడిపో అనబడు కంపెనీయజమానులపై ఒక అభియోగము హైదరాబాదునగర ప్రధానఫౌజ్దారీ న్యాయాధిగారివద్ద మార్చి౨౩వతేదిన విచారణకురాగలదు ఈ బుక్ డిపోవారు నిషిద్ధగ్రంథాలను విక్రయించిరని నేరారోపణచేయబడును. (హై. బులెటిన్)

## హైదరాబాదు డిఫెన్సు నియమావళిక్రిందచర్య

యుద్ధప్రతికూలప్రచారము చేసిరను అభియోగము మోపబడి విచారణచేసిన స్పెషల్ న్యాయాధికారిచే విడుదలచేయబడినట్టి ఆర్—వెంకయ్య బి—వీరయ్యఅనువారలు మార్చి ౧౭వ తేది సోమవారమునాడు హైదరాబాదుడిఫెన్సు నియమావళిక్రింద అరెస్టుచేయబడినట్లు హైదరాబాదు బులెటిన్పత్రికకు తెలియుచున్నది—

హైదరాబాదు డిఫెన్సునియమావళిక్రింద నేరము మోపబడి న్యాయాధికారిచే వదలబడిన రామిరెడ్డిరామకృష్ణన్న బుడిగంపీరన్నగార్లను మార్చి ౧౫వ తేదిన పోలీసులుఖమ్మంమెట్టునుండి పగలు ౧౧గం—౪౫ని—లకు హైదరాబాదుకు రైలులో ఎక్కడికోపంపిరి—

## చెన్నూరు

పాఠశాలావసరము

[స్వ.వి.] ౧౦-౩-౪౧;

వర్ధా-చెల్లికాలా చెన్నూరులో చేరినయొక గ్రామము దీనిగృహసంఖ్య (౧౦౫) జనసంఖ్య (౬౦౦) రమారమిగలదు. చిరకాలమునుండి ఒక పాఠశాలావశ్యకతగలుగుచుండెను. కానికుమారు పదిరోజులక్రిందట పొరుగూరుపాఠశాలాధికారి విద్యాశాఖాధికారియగు మొహతమిగారివద్దకి ఒకవిజ్ఞాపనపంపుకున్నారట. కానిఏటివరకేమియు కార్యరూపముదాల్చినట్లుకనబడదు. పాఠశాలలేకపోవుటవల్ల బాలురకు రాజకీయభాషయగు ఉర్దూనుండిబహిష్కరింపబడడము కాకతమమాతృభాషయగు ఆంధ్రమునకుగూడ కరువాపాయ్యలుకావడంలేదు.

### చెన్నూరు సడకులు

చెన్నూరుతాలూకా కేంద్రస్థానమే కాకుండ వాణిజ్యము కునికిపట్టనిచెప్పవచ్చును. చుట్టుపక్కలనుండు గ్రామ్యులందర్ని ఆకర్షించుచుంటుంది. కనుకరాకపోకలు ఎక్కువఅని చెప్పవచ్చును. గ్రామములోనుండు సడకులుమాత్రము కొన్నికొన్నిచోట్ల మిట్టపల్లములు మరికొన్నిచోట్ల మురికికలిగియుంటాయి. ఇంకేకచ్చాసడకులు కాబట్టి బండ్లరాకపోకలవల్ల ముఖ్యంగా వేసవికాలంలో మాత్రమమితమైన దుబ్బ గాలిలోలేచును తుదకుబాటసారులువిధిలేక అవలికివెళ్లేఅంత ఇకట కెందుతారు. గతసంవత్సరము సర్దారువారుకట్టిసడకులుకట్టించడానికి కొంతడబ్బుమంజూరిఇచ్చారనివిన్నాము. గిట్టిబండమాదకుప్పలుకుప్పలు వీధులలోపడియున్నాయి కానిఆపేమియు కార్యరూపముందాల్చలేదు. పక్కసడకులలేకున్నప్పటికిన్ని అధమపక్షముసడకులపైన దుమ్ములేకుండ తగుపాయముకలంభించిన బాగుండేది. ఆదేమంటే సడకులపైన నీళ్లుచల్లటంతప్ప వేరేకాదు.

మాపటిలెకకు సుమారు గ్రామ్యులందరు గ్రామములదగ్గరనుండు చెరువుకట్టుపై విహారార్థమై వెళ్లుతారు. గ్రామ్యులలోకొందరు ప్రతిరోజుఉదయాస్తమయాది కాలాలయందు ఆప్రదేశములయందుకేవచ్చి మలమూత్రవిసర్జనముచేస్తారు దీనివల్ల ఇతరగ్రామ్యులు ప్రయాణీకులైవచ్చినవారికిచాలకష్టము సంభవిస్తుంది. చెరువుకట్టపాడగువచింతచెట్లుంటె వాటిదిగువకుపసులనిలుపుతారు కానివారికిపరిశుద్ధస్థలము వుండుటకొదానికిచూడాలించరు. ఈవిధంగా వాళ్లింకోచోటకు వెళ్లుతారు. ఇట్లుకాకుండ ఖర్కారీఅధికారులక ప్రారంభరమట యత్యావశ్యకము.

## కల్లుదుకాణము మార్పు

(ఒకవిలేఖరి) అగ్గనూరు, ౧౮-౩-౪౧ ఫ

ఈవూరిమధ్యలోవున్న కల్లుదుకాణము గ్రామము వెలుపలకికడ తేలినది. దీనియొక్క కార్యాయి విషయముగత ప్రమాదినామసంవత్సరము ౬౭వ సంచికగోలకొండపత్రికలో ప్రకటనగావించినది వాఠకులకందరికివిశదమే. కానిదీనిచేతల్లికష్టనిష్టురములనుండి ఇక్కడిప్రజాపమూహము కడతేరినది.

శోకసభ

నిజామాబాదు, మార్చి౪.

తేదిగా-౩-౪౧ సాయంత్రము (౯)గంటలకు శ్రీచిలుక మల్లయ్యాగారిఅధిపత్యంక్రింద శోకసభసమావేశమై అఖిలభారత పద్మశాలి యువజన సంఘాధ్యక్షులైన శ్రీయుత గుంటక నర్సయ్య పంతులుగారిధర్మపత్ని తే౹౯-౩-౪౧ రోజున అకాలమరణముఖదే పత్రిక ద్వారా తెల్సినందుకు అపరిమితమైనదుఃఖము వెల్లడించుచు, పద్మశాలి వారికిరోమణిఆత్మకు పరమాత్ముడు శాంతినొసంగుగాక, యనియు శ్రీవారికిగల్గిన భార్యావియోగదుఃఖమును పరమేశ్వరుడుతొలగించి సహనశక్తినొసంగుగాక యనియుప్రార్థించు తీర్మానము నామోదించిరి.

ఇట్లు
చిలుకమల్లయ్య, కార్యదర్శి, శ్రీమార్కండేయ, శాంతిసమాజము నిజామాబాద్

## సిరిసిల్ల

ఈరాసీల క్రూరచర్యలు
చందావసూలు

(స్వ.వి) ౧౧-౬-౪౧ఫ.

సిరిసిల్లతాలుక "పిండారీలువచ్చిరి" అను వదంతివ్యాపించియున్నది. నిజంగవీరుపూర్వపు పిండారిబందిపోట్లకుమించిన దౌర్జన్యము చేయుచున్నారు.

౩-౯-౪౧ నాడు, సిరిసిల్లవికొన్నిబండ్లు, కరీంనగరానికొన్నిబండ్లు కామారెడ్డికి పోవుచుండెను. ఎల్లారెడ్డిపేటముక్తుచేరగానే ఈరాసీలు ఈబండ్లను పెట్టిపట్టి సామానునింపిరి- సిరిసిల్లకైపుత్రిప్పిరి. పాపముబండ్లవాండ్లు రాత్రంతప్రయాణము జేసియుండిరి. ఎడ్లకుమేతనీరులేకుండెను. ఆవాడేజంటిగంటకు సిరిసిల్లచేరిరి. నిద్రాహారములులేక ఎడ్లుమనుష్యులు శోషతప్పియుండిరి. వీరిస్థితి చూచిఅందరుదుఃఖించిరి- వచ్చువప్పుడు ఎడ్లనుకట్టెలతోచావమోదిరట. త్రోవలోగొల్లవాండ్లుగొర్రెలను మేపుచుండగా రెండుగొర్రెల నపహరించిరట.

## రైల్వేబస్సులపై నిర్ణీతస్థలము తెలుపు బోర్డులుండుట అవసరము

ఖమ్మం, 10అర్ధిబేస్తు

ఇచ్చటనుండివివిధ మార్గములుగా ప్రతిదినము ను అనేకరైల్వేబస్సులు ప్రయాణముసాగించుచుండును. అవిరైల్వేస్టేషనువద్ద వాటిస్థళమునుండి ఓకేమార్గముగా కొంతదూరముప్రయాణముచేసి, తరువాత వివిధమార్గములుగాచీలుచుండును. బస్సుడిపార్టుమెంటువారు వాటిమీద మార్గపునంబర్లు మాత్రముచేసియున్నారు

సామాన్యజనులకుమార్గపునంబర్లు తెలుసుకొనశక్యముకాదు. అందుచేహైదారాబాదు, సికింద్రాబాదులో ప్రయాణముజరుపుచున్న. బస్సులపై ప్రాసిన పేరుమాదిరి, అవిచేరునిర్ణీతస్థలమును తెల్పుబోర్డుకుండినచో చాలాసహాయముగా నుండును అనేకులు యీ యిబ్బందులను పడుచుండినను మిన్నకయూరకొనుచున్నారు. కొందరుతాము వెళ్లదలంచిన బస్సుఇదేననితలంచి, అపి, ఎక్కి, కొంతదూరమువెళ్లినపిదప కాదనితెలుసుకొని, తబ్బిబ్బుపడి, దిగిపోవుటయున్నూ జరుగుచున్నది. కావుటడిపార్టుమెంటువారుయీవిషయముపైతెప్పక గ్రహించి, అవసరమగునట్టి మార్పును వెంటనే చేయించి ప్రయాణీకులకుసౌకర్యము కూర్తురని ప్రార్థన

ఇట్లు
ఒకరు

గ్రామములో ప్రవేశించుటతోడనే ఒక్కగౌండ్లవానివద్ద రూపాయినేబులతీసుకొని రూపాయిఇవ్వకత్రోవబట్టెను. రూపాయిఅడిగిన కొట్టవచ్చెను. ఈవార్తలువినడముతే సాహుకార్లు తమతమ దుకాణాలన్ని మూసివేసిరి.

సిరిసిల్లకుచేరుకనున్న తంగలపల్లివెళ్లి ౯౦ రూపాయిలువసూలుజేసితిమి. శాందూరునకరంరూ వసూలుజేసితిమి, వేమూరువాడలో రూ ౫౦వసూలుజేసితిమనిచెప్పుచున్నారు. సిరిసిల్లసాహుకార్లనుచందాయివ్వము లేకున్న మాయిష్టముకచ్చినపని జేసెదమని బెదిరించుచున్నారు. రెండేండ్లనుంచిక ఇట్టిబాధపడుచున్నాము. చందాయివ్వకున్న చంపెదము ముక్కముక్కలు జేయుదమనుచున్నారు.

## హైలీలో మత సామరస్యము

ఎల్లారెడ్డి గ్రామ అదృష్టము

(ఒకవిలేఖరి) ఎల్లారెడ్డి —-౪౧ఫ.

ఎల్లారెడ్డి మెదకు జిల్లాలోని తాలూకాకేంద్రము ఇక్కడ నేడుఉదయము , గంటలు మొదలుగా-ంటలవరకు ఈగ్రామములో తిరిగిచందా పోగుచేసుకొని భోజనానంతరము పగలు గంటలనుంచి సాయంత్రము గంటల వరకు రంగులతోఆడుకొంటూ, నాయిన్యముతో పాటలు భజనలుసలుపబడెను. ఈ ఉత్సవములో చాలామందిమహమ్మదీయులుకూడ పాల్గొనిరి వీరఅందరితోసహా శ్రీరామ మందిరమునకు పోయి దర్శించివచ్చితిమి.

సాయంత్రము ౯ గంటలకు గ్రామములో వ్యాయామపోటీలు, కట్టెపసులు, మరియు లేసీటివిందులు సుమారుఆయిదారువందల జనసమూహముతో రాత్రి౧గంటవరకుజరుపబడెను. కుస్తీలలో గెలిచినవారిగణనుండి ఇందులో హిందువులుమహమ్మదీయులుగలరు. కట్టెపనిచేసినవారలు ౧౨మంది కిరలందరికిని వస్త్రములనుబహుమానములు ఇవ్వబడినవి పోలీసులలో మొహరీలుగారు గేటుయుక్తముగా రాత్రింబగలు శ్రమయుతక చాలా మంచిఏర్పాట్లు చేసిరి.

## సిరిసిల్లలో ఆర్యసమాజ స్థాపన

పండిత్ నరేంద్రజీ రాక

(స్వ.వి.) సిరిసిల్ల, అర్దిబెహెస్తు౧౭

సత్యకుమార్ సిద్ధాంతరత్న గారు ఒక నెలకష్ట పడి ప్రచారమొనర్చి యువకులను ఆర్యసమాజము లో చేరునట్లు చేసిరి. ౧౭వ తేదినాడు శ్రీ నరేంద్ర జీ గారు వచ్చియుండిరి. గ్రామములో అల్లరులు చెని పోవసిద్ధమైరి రెండు జాములకు కరీంనగ రమునుం చి పోలీసుసర్కిల్ (అధికారి) మంతజం, పది మందిజవానులు వచ్చియుండిరి.

౧౭వ తేది సాయంత్రము ౬ గంటలకు సిరిసిల్ల వీధులన్నిటిలో పోలీసులు నిండియుండిరి, ఇద్దరు ముంతజెంలు, ఒక్క సర్కిలు అధికారి, నల్గురు కానిస్టేబులులు ఆర్యసమాజ పెండాల్ లో చేరిరి.

సుమారు ఒక గంటసేపు పండిత్ జీగారు వుపన్యసించిరి. జనులు సుమారు౩౦౦ క్రిక్కిరిసి యుండిరి. శాంతముతో ఉపన్యాసము వినిరి ఉప న్యాసాంత · అందరుపొగడుచు, కొనియాడుచు వెళ్ళిరి.

౧౩-౬-౫౦ఫ. నేడు ఉదయము ౯ గంటలకు బాజాతో ఊరందరిని "జండాఠందనము" కొర కు ఆహ్వానించిరి. పోలీసులు తగినకట్టుబెట్టములు చేసిరి. కరీంనగరంనుంచివచ్చిన సర్కిల్ నముం తజెంపోలీసులు సమాజమ్మందిరములో నే ఉదయ ము౯ గంటలనుంచి జండా స్థాపించువరకుండిరి. సుమారుపదిగంటలకు శ్రీపండితనరేంద్రజీ గారు స్వయముగా ఓంకారపతాకమును స్థాపించిరి. సు మారురెండుమందలమంది ఈవుత్సవములో పాల్గొ నియుండిరి. భోజనానంతరం పండిత్ జీగారు టేబుల్ టాక్ లో నిమగ్నులైరి.

నేడుసాయంత్రము ఒకగంటసేపు నరేంద్రజీ గారు ఉపన్యసించిరి. సుమారు౫౦౦మంది క్రిక్కిరిసియుండిరి. శాంతముగా వుపన్యాసమును వినిరి వీరితర్వాత శ్రీసనాతనపండితులు, భారత విమర్శనము" గ్రంథకర్తలగు శ్రీశిష్టులా సూర్యనారాయణశాస్త్రిగారు ఉపన్యసించిరి. శ్రీ శాస్త్రిగారు చాలమృదుమధురఆంధ్రభాషలో సనాతనధర్మమునగా నేమో విశదీకరించిరి జనము శ్రద్ధతో వినుచుండిరి. యువకులకు మంచిఉద్బోధచేసిరి. సనాతనధర్మములో నేటి లోపటిలోపములను సంస్కరించుకొనుమనిరి హరిజనుల నుద్ధరించవలెననిరి విజ్ఞానముసంపాదించుకొమ్మనిరి ఒకరిపైఆధారపడియుండకుమనిరి. ప్రతిపని స్వయంగా నెరవేర్చుకొనవలయునని నుద్బోధించిరి,

### ఆర్యసమాజ సభ ముగింపు

సిరిసిల్ల ౧౩-౬-౫౦ఫ

౧౨వతేదినాడు సాయంతము ౯ గంటలకు శ్రీశిష్టులా సూర్యనారాయణ శాస్త్రిగారి వుపన్యాసాంతరము శ్రీసత్యదేవసిద్ధాంతరత్న గారు పోలీసువారి కట్టుదిట్టమునకు అభినందనములు తెలిపిరి. స్థానికులు శ్రద్ధతో వ్యాఖ్యానము విన్నందులకు అభినందనములు తెలిపిరి. వారికి సహాయము నొసర్చినవారికి అభినందనములు తెలిపిరి. పండితనరేంద్రజీగారికి అభినందనములు తెలిపిరి ౯ గంటలకు శాంతముగా సభ ముగిసినది ౧౨వ తేది నాడు ప్రాద్దున౧౦గంటలకు శ్రీనరేంద్రజీ గారు కరీంనగర ముప్రయాణమైపోయిరి. సమాజస్థాపనకు సిరిసిల్ల ప్రజలందరు సంతసముతెలిపిరి ఒక నూతన తేజము ప్రకాశించుచున్నది

## బాలికతో గమనము

గుర్వలగూడెం, ౧౦-౬-౫౦

(ఒక విలేఖరి)

ఈగ్రామములో, మొన్న అనగా, ౬-౬-౫౦ఫ. సోమవారం ఒకహరిజనునికూతురు సం||౧౨ల వయస్సుగలది పరిసరపొలాలకు పిడుక ఏరుకొనడా నికి వెళ్లింది సాయంత్రం సుమారు ౫ గంటల సమయానికి ఆదారిన ఒకహరిజనయువకుడు సం|| ౨౨ల వయస్సువాడు రాసంభవించింది: వాడు ఆబాలికనుపట్టుకొని సంభోగించి వెళ్ళిపోయినాడట, అందుచేతబాలిక బాధతోఏడ్చుచు మర్మాంగమునుండిరక్తముప్రవిస్తూండ తూలుమాకొంపచేరగా తల్లితండ్రులు ఆశరీరమునంతయు జూచి నిచూచి తలికంద్రులుభయపడి యా నెంటనే ఖమ్మం సర్కారీ ఆసుపత్రిలో చేర్పించిరి ఆబాలికయిపుడు కొంచమారోగ్యస్థితిపొందినది.

తదుపరి అనుమానాస్పదుడైన యువకునితల్లం పహాడు పోలీసువారు ౮-౬-౫౦ తారీఖున అరెస్టుచేసినారు ఇపుడాయువకుడు ఖమ్మంమెట్టులో రిమాండునందున్నాడు కేసునడుచుచున్నది-

## విద్యార్థిసంఘానికి గాంధి మహాత్ముని సలహా

కొద్దికాలముక్రింద మధ్యరాష్ట్రమందలి నాగపూరులో జరిగిన విద్యార్థిమహాసభతరువాత విద్యార్థులలో అభిప్రాయభేదములేర్పడినవని తెలుపుచు అఖిలభారతవిద్యార్థిసమ్మేళన ప్రధానకార్యదర్శి ఎం. ఫరూక్ గారు గాంధిమహాత్మునికి తరువాత జరిగినసంగతులను తెలిపినారు అందుకు మహాత్ముడు సమాధానమిచ్చుచు నిష్పక్షపాతము గనొకమధ్యవర్తిసంఘము నేర్పాటుచేసి, ఆసంఘము చే దారులవిభేద కారణములనువిచారింపజేసి ఆ విచారణపై ఆసంఘమువారుచేసెడి తీర్పునకు బద్ధమువక్షములును అంగీకరించవలెనని తెలిపినారు. ఉభయపక్షవిద్యార్థులను సమాధానపడుటకు తాముతోడ్పడగలమనికూడ చెప్పినారు

## భారతీయ మితవాదులకు బ్రిటిషు అభిప్రాయనివేదన

ఇటీవరలో బ్రిటిషు పార్లమెంటు సభ్యులు కొందరు భారతీయనాయకులనుద్దేశించి ఒకవిజ్ఞప్తిని ప్రకటించగా, దానికిమితవాదినాయకులు కొందరుసమాధానమును ప్రకటించియుండిరి. మొదట బ్రిటిషువారుచేసినవిజ్ఞప్తిలో సంతకముచేసిన సర్ జార్జి షుస్టరు గారు భారతీయమితవాదమహాసభాధ్యక్షునకు వి. ఎన్. చందావర్కర్ గారికి ఒకతంతిసందేశముద్వారా సమాధానమిచ్చినారు మితవాదులప్రకటనను బ్రిటనులో తాముచూచి భారతీయుల అభిప్రాయము గ్రహించగల్గితిమని యు, ఇకబ్రిటిషు అభిప్రాయాన్ని కొద్దిరోజులలో తెలియబరచగలమనియు దానిని భారతీయులవగతముచేసికొనవలెనయు, ప్రకటనలద్వారాగాక లేఖలద్వారా ఈవిషయంలో చర్చలు జరుపుటమంచిదనియు షుస్టర్ గారు తెలిపినారు.

## చందాదారులకు మనవి

చందాదారులు మా కార్యాలయమునకు జాబులు వ్రాయునపుడు, మనిఆర్డర్లు బంపునపుడు, తమ చందానెంబరు వ్రాయుటయందు తగుశ్రద్ధ గైకొనుటలేదు చందా నెంబరు వ్రాయనిది వెంటనే జవాబీయుటకు వలనుపడదు. కాన చందాదారులెల్ల ముఖ్యముగ గమనింపకోరెదము.

మేనేజరు, గోలకొండపత్రిక.

## ఆర్యసమాజాలు హోలీఉత్సవాలు

### చిక్కడపల్లి రామనగర్ సమాజం

అర్దిబెహెస్తు ౯ వతారీఖు అనగా ౧౩ వ మార్చి తేదిన) ఆర్యసమాజంలో హవనం భజనలయినతరువాత ఆర్యప్రాదేశిక ఆంధ్రప్రతినిధిసభ యొక్క ప్రధాని శ్రీ స్వామీ త్యాగమూర్తి పండిత చంద్రపాల్ గారియొక్క కరకమలములచే ఝండావందనము ప్రారంభింపబడినది. తదుపరి సమావేశమును పాల్గొన్నహరిఫాటో తీయబడినది- హిందూసభమండలియొక్క కార్యదర్శి గారయిన బి.జి. ఖేస్కరు బి.ఏ.యల్.యల్.బి గారున్ను, పండితచంద్రపాలుగారున్ను జండాయొక్క ప్రాముఖ్యతనుగూర్చియు దాని పట్లమనకర్తవ్యమునుగూర్చియు దీర్ఘోపన్యాసము చేసిరి- ఈసమాజముయొక్క ప్రాథమిక సభ్యులలో ఒకరయిన బాలరాంగారు వారిసమాజముయొక్క స్థాపనములో నాయపడినకష్టములునూ, ఆర్యసమాజమునాయకులవారిపట్ల చూపెడినిరుత్సాహభావముగూర్చి కూడా చెప్పిరి.

### హైదరగూడ సూర్యనగర్ సమాజం

అర్దిబెహెస్తు ౯ వతారీఖునాడు యీసమాజంలో ప్రధానిగారయిన శ్రీ స్వామీ పండిత శ్రీన్ ..రసయ్యగారు ధ్వజారోహణ మహోత్సవము జరిపిరి పండితచంద్రపాల్ పండితమోహన్ లాల్ గార్లు జండాప్రాముఖ్యతనుగురించి ఉపన్యాసములుచేసిరి తరువాత యీసమాజమునా రి సమాజము చేరుగలిగిన భోర్డులతోగూడిపోవా ఉత్సవముతో సాయంకాలమువూళ్లోనిరి వీరి నాయకత్వముక్రింద పలువురుఊరేగింపుతో పాల్గొనిరి, త్రోవలో ఆర్యయువసమాజపు కోశాధిపతి గారయిన ప్రేంజీ గారున్ను హిందూప్రజామండలియొక్క కార్యదర్శులయిన ఖేస్కరు జోషి గార్లును చంద్రపాల్, నరసయ్య గార్లకు పూలమాలాంకృతులను చేసిరి ఆర్యప్రాదేశిక ఆంధ్రప్రతినిధిసభతరిగిహిందూ నాయకులయిన ఖేస్కరు జోషీ గార్లకు తిరిగిపూలమాలలువేసిరి ఉత్సవము ట్రూపుబజారుగుండా హైదర్ గూడవచ్చిన తరువాత ఉత్సవముముగిసెను,

వైదిక్ పాఠశాలచిక్ మైదాన్ ఖాను

ఈ సమాజములో హవన్, భజనలయినతరువాత ఇదేదినముకోలనురామచంద్రారెడ్డిగారు ఝండావందనముచేసిరి

### రాంకోటి ఆర్యసమాజము

పైతారీఖున మధ్యాహ్నము ౧౧ గంటలకు హవన్, భజనలయినపిదప శ్రీస్వామీ త్యాగమూర్తి పండితచంద్రపాల్ గారిచే ధ్వజారోహణ మహోత్సవముజరుపబడినది ఇక్కడజండాయొక్క ప్రాముఖ్యతనుగూర్చి శ్రీచంద్రపాల్ గారు ఉత్సాహపూరితమయిన ఉపన్యాసముచేసిరి

(నేషనల్ న్యూస్ సర్వీస్)

## విశ్వనాథపల్లిజాతరలో జీవదయా ప్రచారము

కృష్ణా జిల్లాలో విశ్వనాథపల్లియను పేరుగ్రామముకలదు ఇచ్చట ప్రతిసంవత్సరము నాంచారమ్మ జాతరలోఅనేకవేల పశువులనుబలిఇచ్చుచుందురు. ఇట్టిదురాచారమును పశుబలిఅర్పుటకు గుడివాడ జైనసంఘమువారు దక్షిణహైదరాబాదు శ్రీజీవ జ్ఞానప్రచారకమండలిని ప్రచారము కొరకుపిలిపించిరి. మండలిగౌరవకార్యదర్శి సేటు ప్రేమ్ జీ లాల్ జీ గారి అజ్ఞానారము మండలి మేనేజరు రామర్ దాసు, పండిత కృష్ణస్వామినాయుడు భజనికులగు తుల్జారాం, బాబామురలీ గిర్ జీ, ఈశ్వరయ్య, జయరాచారి మొదలగు వారు ౨౫-౨-౪౧ తేదినబయలుదేరి ౧౩-౩-౪౧ వరకు కొండపల్లి, బెజవాడ, గుడివాడ, బందరు, కోత్తపాలెం, కోమార్, చాతరి ఏరవాలీ విశ్వనాదపల్లి మొదలగుఊళ్ళలో భజనలు హరికథలు మ్యాజికులాంతరు ప్రదర్శనములద్వారా ఉపన్యాసములద్వారా అనేకులహృదయములను మార్చగలిగిరి. విశ్వనాథపల్లిజాతరలో ........ ముఖ్యులగు చాకలి యొకరివారు మండలిప్రచారమునువిని వేలకొలదిజనులు పశుబలిచేయమనిప్రతిజ్ఞచేసి, ఈరెండు గ్రామస్థులుమాత్రము సాత్వికపూజచేసిరి

ఇట్లు,
గుడివాడ జైనసంఘమువారు.

## వరదరాజులు నాయుడు గారికి వైస్రాయి దర్శనము

మధ్యమార్గంలో గాంధిమహాత్మునితో ఆలోచన

అఖిలభారత హిందూమహాసభ ప్రధానకార్యదర్శియగు డాక్టర్ పి. వరదరాజులునాయుడుగారు మార్చినెలఆఖరువారంలో ఒకరోజు వైస్రాయిగారినిదర్శించి ఇప్పటి · జాతీయ చిక్కుస్థితిని తొలగించుమార్గమునుగూర్చి సంభాషింతురనివిశ్వస్తంగా తెలియుచున్నది. వారు ౨౫ వ తేదిన మద్రాసునుండి వర్ధాకుబయలుదేరిపోయి గాంధిమహాత్మునితో సంభాషించి,అక్కడినుండి ఢిల్లీకిపోయి వైస్రాయి గారినిదర్శించెదరు.

## సర్. సి.వి. రామన్‌గారికి అమెరికా గౌరవము

భారతదేశపు గొప్పసైన్టిస్టుఅగు సర్. సి. వి. రామన్‌గారికి అమెరికాసంయుక్తరాజ్యములోని ఫిలడెల్ఫియారాష్ట్రములో (ఫ్రాంక్లిన్ ఇన్స్టి) ట్యూటువారు ఒకబంగారుపతకముతో సత్కారముచేయుటకు నిశ్చయించి వారినచటికి రమ్మని ఆహ్వానించినారు. అక్కడికివచ్చినపుడు రామన్‌గారు చేసినపరిశోధనల ఫలితములనుగూర్చి ఉపన్యాసము లొసగవలెననికూడ కోరబడినారు.

సి. వి. రామన్‌గారు ఇపుడు బెంగుళూరులో సైన్సుఇన్స్టిట్యూటునందు పనిచేయుచున్నారు. అందువల్ల బెంగుళూరుసైన్సుఇన్‌స్టిట్యూటు అధికారులు ఒప్పుకొన్నగాని రామన్‌గారుఅమెరికాకు పోవవీలులేదు. బెంగుళూరు సైన్సుఇన్స్టిట్యూటువారు మార్చి౧౫వ తేది సమావేశమై రామన్‌గారిని అమెరికాకుపోనిచ్చుటవలన అక్కడి ముఖ్య పరిశోధనాగారములను దర్శించుటకు వారికవకాశమిచ్చినట్లగునని యెంచి రామన్‌గారు అమెరికాకు పోనిచ్చుటకు నిశ్చయించిరి. అమెరికాకు ఈ యుద్ధ కాలం లో పోవీలగునో కాదో రామన్‌గారింకను నిశ్చయించుకొనలేదు ఒకవేళ రామన్‌గారుపోనిచో, ఆపతకమును అమెరికాసంయుక్తరాజ్య ప్రధాననగరమగు వాషింగ్టనులో బ్రిటిషు పభుత్వపు రాయబారియగు లార్డుహాలిఫాక్సుగారిచేతి కిచ్చెదరు. హాలిఫాక్సుగారు భారత ప్రభుత్వము ద్వారా రామన్‌గారికి ఆపతకము అందునట్లుచేసెదరు.

## సంసారంకూడా వృత్తియే

దానికి అనుకూలమైన శిక్షణకావలెను

శ్రీమతి బ్రిజలాల్ నెహ్రూ ఉపన్యాసం

లాహోరు, మార్చి ౧౫

లాహోరు మహిళాకళాశాలలో అఖిలభారత మహిళాసభ అధ్యక్షురాలగు శ్రీమతి బ్రిజలాల్ నెహ్రూగారు స్నాతకోపన్యాసం చేసిరి స్త్రీలుఉత్తమజీవనము చేయుటకుగలశక్తినంతటినీ యిమ్ముటకును, వారిని సంఘసేవకులుగా మార్చుటకును వలయుశిక్షణములభించుటకై ప్రస్తుత విద్యావిధానమునంతయు పూర్తిగామార్చవలెనని ఆమెఉపన్యసించెను.

మగవానికివలె స్త్రీకిని ఒకవృత్తి ఉండవలెననియు లేకున్న ఆమెకుఆర్థిక స్వాతంత్ర్యము రాదనియు, సంసారముకూడా ఒకవృత్తియేయనియు, అదిసవ్యంగా జరుగునట్లు ప్రత్యేకశిక్షణము ప్రతివారికి లభింపచేయవలె ననియు ఆమె చెప్పెను.

బాలికలు ప్రస్తుతవిద్యావిధానములో మనస్తత్వశాస్త్రమును బాగుగా అభ్యసించవలెననిరి.

### రెండవవృత్తి విద్యామహాసభ

వర్ధాగంజి, మార్చి ౧౬

రెండవవృత్తివిద్యామహాసభను ఏప్రిల్ ౧౧వ తేదిని ఢిల్లీజమియానగరంలో ప్రారంభోత్సవము చేస్తారని 'సేవాగ్రామ హిందూస్తానీ తాలిమీ సంఘు' కార్యదర్శి తెలిపినాడు.

## సింధుమంత్రుల జీతాలహెచ్చింపు

సింధురాష్ట్రంలో ఈహాలిఅల్లాబక్షుగారు ప్రధానమంత్రిఅయినతర్వాత ఇపుడుమంత్రులజీతాలు రూ॥ ౫౦౦నుండి రూ ౧౫౦౦కును, అసెంబ్లీఅధ్యక్షునిజీతమును రూ ౧౦౦౦లకు హెచ్చించుటకు శాసనముచేయుంచుటకై ఆలోచనలు జరుగుచున్నవి.

## "హరిజన్"పత్రికల పునఃప్రకటన

గాంధిమహాత్ముని గుజరాతీ, హిందీ ఇంగ్లీషు "హరిజన్"పత్రికలను మార్చినెలఆఖరువారంలో లేక ఏప్రిలునెల మొదటివారంలోనో మరలప్రకటించుటకు ప్రారంభింతురని తెలియుచున్నది.

## దీనబంధు ఆండ్రూస్ స్మారకనిధి

గాంధీమహాత్ముని విజ్ఞప్తి

గాంధీమహాత్ముడు మరల, దీనబంధుఆండ్రూస్‌గారిస్మారకనిధికై విరాళములను ప్రజలీయవలెనని విజ్ఞప్తిచేయవలసిన అవసరముకలిగినందుకు చాలవిచారము తనకుకలుగుచున్నట్లు మార్చి౧౫వ తేదినాటిఒకప్రకటలో తెలిపినారు. ఆండ్రూస్‌గారు బీదలనక ధనికులనక క్రైస్తవులనక క్రైస్తవేతరులనక, ఆంగ్లేయులనక ఆంగ్లేయేతరులనక దీనదశలలోని వారలకందరికిని ఎంతోసహాయపడియుండిరి. వారుజ్ఞానపుంజమును వెదజల్లుటకై శాంతినికేతనమును తమనివాసముగా నేర్పరుచుకొనిరి- డాక్టరు రవీంద్రనాథ టాగూరుగారుస్థాపించినఈనిధికి విరాళాలు వసూలుచేయుటలో ఆండ్రూసుగారే తమజీవితకాలంలో ప్రధానపురుషులైరి. కాబట్టిఆండ్రూసుగారిని చిరకాలము స్మరించుకొనవలెనని శాంతినికేతనముఅభివృద్ధిపొందునట్లుఎక్కువ ధనసహాయముచేయుటకంటె ఉత్తమమార్గములేదు. టాగూరుగారిశాంతినికేతనములో నేర్పబడువిద్య, టాగూరుగారవలంభించినకార్యములుకేలకొలదిమంది దేశీయ స్త్రీ పురుషులకును, బాలబాలికలకును వికాసముకలిగించినవి. ఇట్టిఈఆండ్రూసునిధి సందర్భములోవినబడు ఇద్దరుప్రముఖులపేర్లువిన్నంతనే రావలసిన విరాళాలుచేరకపోవుట ఎందుకుఅని గాంధిమహాత్ముడడుగుచున్నాడు. ఈవిరాళాలుఇనాలుకై తానిపుడు వార్ధక్యముచేతిగజాలనిదశలో మనుండుటవల్ల, ఇపుడువిద్యార్థులు, ఉపాధ్యాయులు, మిత్రులు, కార్మికులు, కళారాధకులురాబోవు ఏప్రిలు ౫వ తేదిననీనిధికికావలసిన అయిదులక్షల రూపాయలనువసూలుచేసినచో, ఆ౫వ తేదినాడు ఆండ్రూస్ సంస్మరణదినముగుటవల్ల చాలాబాగుంటుంది అని గాంధిమహాత్ముడుప్రకటలో కోరినాడు-

సంవత్సరమునకు చందా
౬ హాలీ రూపాయిలు
ఆరుమాసాలకు
౩ రూపాయిలు
బ్రిటిషిండియాలో
సంవత్సరానికి
౫-౮-౦ కల్దారు.
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

The only
Popular Paper
That reaches
The masses
In the Dominions
Best Medium
for
Advertisement

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

Volume 15 | Hyderabad-Dn | Monday 24 th March 1941 | Number 88

## బ్రిటిషుయిండియాకుచేరిన పూర్వాస్తులసంపాదన

### సంస్థానాధీశుల యత్నము

నరేంద్రమండలి అధ్యక్షుని ప్రకటన

మార్చి ౧౨ వ తేదిన క్రొత్తఢిల్లీలో నరేంద్రమండలి సమావేశమును వైస్రాయిగారుప్రారంభించినట్లు గతసంచికలో తెలిపికొంటిమి. నరేంద్రమండలి ఆలోచనలు ౧౫ వతేదినాటితో పరిసమాప్తమైనవి. రెండుతీర్మానాలు ఆమోదించబడినవి. ఒకటి భారతదేశమంతటను సంస్థానాలలోను యుద్ధసన్నాహాలు చురుకుగా సాగుటకై వైస్రాయిగారు వెంటనే చర్యగైకొనవలెనని కోరుచున్నది. ఆచర్యఎట్టిదోసూచించుచు ఇండియాప్రభుత్వపు యుద్ధసన్నాహాలతో సంస్థానాలప్రతినిధులకు సంబంధముండునట్లు యుద్ధసలహాసంఘాలు ఏర్పరచుటయోలేక సంస్థానాలతోఆలోచించి మరియొకపద్ధతి నిర్ణయించుటయో జరుగవలెననిరి. మరొకతీర్మానములో ఆఫ్రికా, అల్బేనియాలలో బ్రిటిషుమండలిసేనలు విజయములుపొందుచున్నందుకును, బ్రిటనుప్రజలు జర్మనువిమానాలదాడులచే ధైర్యమువదలనందుకును నరేంద్రులుఅభినందించిరి. ఈమెచ్చుకొనదగినఅంశాలు బ్రిటనుకుఅంతంలో జయముకలుగునని సూచించుచున్నవని అతీర్మానంలోనే అభిప్రాయమిచ్చిరి. బ్రిటనుకు జయముకలుగుటకై సంస్థానాధీశులు శక్తివంచనలేకుండ తోడ్పడగలమనియు ఆతీర్మానములో తెలియజేయబడెను.

సమావేశము ముగియుటకుముందు నరేంద్రమండలి ఛాన్సెలరుగారు వైస్రాయిగారిప్రారంభోపన్యాసమందలి సూచనలకు నరేంద్రమండలి పంపవలసిన సమాధానమును చదివివినిపించిరి భారతదేశాభివృద్ధికి తాముప్రతికూలమైన అభిప్రాయముకలిగి ఉండలేదనియు, యుద్ధకాలంలో కక్షలనుపెంచు పెద్దచిక్కులురాకుండాచేయగలమనిరేయే ఆశించుచున్నామనియు చాన్సిలరుగారు తెలిపిరి,

౧౯౪౦ జనవరి నెలఆఖరుకు యుద్ధనిధికై సంస్థానాలనుండి దాదాపురూ ౧౧౮౮౭౦౦౦ లు వసూలైనవనియు, రు ౬౧౭౧౦౦౦ మరల వసూలగుచున్నవనియు. ఇంతేగాక వడ్డీఅపేక్షించని ఋణములుగా రూ ౧౧౩౦౦౦౦౦ లును, నూటికి సంవత్సరానికి రూ ౩ లవడ్డీనపేక్షించే ఋణముగా రూ ౬౬౦౦౦౦౦లును సంస్థానాలనుండి యుద్ధనిధికి అందిజేసినట్లును ఛాన్సెలరుగారు ప్రకటించిరి,

వైస్రాయిగారి ప్రారంభోపన్యాసమందలి సూచనలకు సమాధానముగఛాన్సెలరుగారుచెప్పినదేమనగా సంస్థానాధీశులు భారతదేశంక్రమంగావృద్ధిజెందుటకు ఆటంకమేమియు తాముపెట్టుటలేదనిరి. భారతదేశానికి బ్రిటిషుప్రభుత్వమువారి యాజమాన్యమున సంపూర్ణస్వాతంత్ర్యము, అన్నిస్థితులలోకి గొప్పస్థితిలభించునట్లుచేయుటకై సంస్థాధీశులు అభిలాషగలిగి యున్నారు. ఈ కష్ట సమయంలో యుద్ధమునకుతోడ్పడుటకే ప్రయత్నములన్నియు జరుగవలెనేగాని కక్షలనువృద్ధిచేయు సమస్యలు బయలుదేరరాదని సంస్థానాధీశులఅభిప్రాయము కాబట్టి సంస్థానాధీశులు ఈసంవత్సరము దేశమందలి రాజకీయపరిస్థితినిగూర్చి ఎట్టి తీర్మానము గాని చేయదలచలేదు. భారతదేశ భావిరాజ్యాంగ నిర్మాణమును నిర్ణయించుటకు భారతజాతీయజీవనమందు ప్రాముఖ్యముగలవర్గాల ప్రతినిధులతో ఒకసంస్థఏర్పడునవియు, అట్టిదు సంస్థానాలతో బ్రిటిషుప్రభుత్వమువారిసంధులవల్ల సంస్థానాలకు ఏర్పడినహక్కులుఫలించుట కేర్పాటుచేయబడునవియు వైస్రాయిగారు ౧౯౪౦ ఆగస్టునాటి దినచేసినప్రకటనను సంస్థానాధీశులు ఆమోదించుచున్నారు భారతదేశము క్రమంగాఅభివృద్ధిపొందవలసినకాలము సమీపించినప్పుడు సంస్థానాధీశులు బ్రిటిషుసామ్రాజ్యముయొక్క తమకుగలవిధులను తప్పకనెరవేర్పగలరని ఛాన్సెలరుగారి ప్రకటనలో తెల్పబడినది.

#### చిన్న సంస్థానాల సహకారపద్ధతి

పోయినసారి నరేంద్రమండలి సమావేశంలో వైస్రాయిగారుపన్యసించుచు సాధ్యమైనంతవరకు పరిపాలనవిషయములో చిన్న ఆదాయంగలసంస్థానములు వర్గములుగాచేరి వ్యవహరించుట మంచదని సూచించియుండిరి, ఈసూచన ఆచరణ ఎంతవరకుజరిగినది తెల్పుటకు ఛాన్సెలరు గారు తమ ప్రకటనలో రెండుమూడుమాటలుచెప్పిరి. చిన్న సంస్థానాలఅధిపతుల అధికారాలకుగాని, సంస్థానాల స్వాతంత్ర్యానికిగాని భంగములేకుండ చిన్నసంస్థానాలు తమంతతాముఇష్టపడి ఇట్లు వర్గములుగచేరి పరస్పరసహకారము చేసికొనవలెననియే వైస్రాయిగారిభావమని నరేంద్రులుతలచుచున్నట్లు ఛాన్సెలరు గారుచెప్పిరి. ఇట్టివర్గీకరణ విధానం పైసర్గికమైన హద్దులనుబట్టి ఒకటిగాచేరదగినసంస్థానాలకుమాత్రమే వర్తింపజేయుక, సంస్థానాల అంగీకారముపైననే వర్తింపజేయబడవలెననియు ఛాన్సెలరుగారు చెప్పిరి.

కలిసి సేవచేయుటనుగూర్చి వైస్రాయిగారుగాంచియుండినసూచనకు సమాధానంగా ఛాన్సెలరుగారు యుద్ధమునకుతోడ్పడుటకై ఎక్కువగాపని చేయుచున్నందువల్ల ఇప్పుడు శాంతిసమయంలోవలె ఆసూచనవిషయమై సంస్థానాధీశులు శ్రద్ధగాఆలోచించుటకు తీరకలేకున్నదని తెలుపబడెను.

ప్రకటన ప్రారంభంలో ఛాన్సెలరుగారు సాధారణంగా సంస్థానాలలోవిధించే పన్నులుకూడా బ్రిటిషుఇండియాలోని రాష్ట్రాలలో పన్నులకంటెతక్కువగానే ఉన్నవని చెప్పిరి "సంస్థానాలలో పరిపాలన నిర్దష్టంగా సాగుచున్నట్లు గొప్పగాచెప్పుకొనుటలేదు. కాని సంస్థానాలు అభివృద్ధి కొటకములుగాలేవనియు, ప్రజలకు హెచ్చుసౌకర్యములు కలిగించవలెనను భావముతోనే పరిపాలనసాగించుచున్నవనియు న్యాయముతోజూచువారు గ్రహించుకొనగలుగుదురు" అని వారుచెప్పిరి.

ఇండియా ప్రభుత్వమువారుచేసిన ఆదాయపుపన్ను సవరణకారణంవలన సంస్థానాలకుకలిగిన కొన్నిచిక్కులను తొలగించుకొనుటకై నరేంద్రమండలివారు ఇండియా ప్రభుత్వముతో రాయబారములుసేయుచున్నట్లు తెలిపిరి.

#### బ్రిటిషు ఇండియాలో సంస్థాన ప్రజలకు ఉద్యోగాలు

బ్రిటిషు ఇండియాలో ఇండియా ప్రభుత్వోద్యోగాలలోను, బ్రిటనులో ఇండియామంత్రిగారికార్యాలయపు ఉద్యోగాలలోను సంస్థానప్రజలుచేరుటకుఅవకాశమివ్వవలెనని ఒకప్రకటనచేయుటకై నరేంద్రమండలివారు రాయబారాలు జరుపుచున్నారు.

ఇకముందు సంస్థానాధీశులకు రిజర్వుబ్యాంకులో వాటాలభించుట కనుకూలంగా ఇండియారిజర్వుబ్యాంకు శాసనాన్ని సవరింపజేయుటకు నరేంద్రమండలివారు ఆలోచించుచున్నారని ఛాన్సెలరుగారు తమ ప్రకటనలో తెల్పిరి.

---

## ఒకటే చితిలో భార్యాభర్తలగ్ని కాహుతియగుట

హైదరాబాదు (దక్కను) మార్చి ౨౨

చరిఅర్ధిబేహస్తు మంగళవారమురాత్రి ౧౧½ గంటలకు అగ్రసేవాదళమంత్రియగు శ్రీరామగుప్తాగారును; వారిభార్య పార్వతీభాయియు పరుండియుండగా పక్కనుపెట్టుకొనియుంచిన దీపముచేకాబోలు వారలబట్టలకునిప్పంటుకొని అక్కడకొంతటకుశకిని మించిపోవుటచే కేకలిడప్రారంభించిరి అర్ధనికిపక్కయింటివారలుమేల్కొంచి సంగతియేమిటోవిచారించుటకై వారలుపడుకొనియుండినగదితలుపు తట్టప్రారంభించిరి, అందుపై గుప్తగారుతలుపుతెరచి ఈవలకురాగా ఇద్దరిపై బట్టలుమండుచుండుటగాంచి యెటులోచకవారలనుశీఘ్రచేసార్చిరి. ఇంకనుశ్రీరామగుప్తగారికి మంటలుతక్కువకాకయుండుటచే నీళ్లహవుజులో దుముకివార్చుకొనిరి, ఇంతలోపోలీసులువచ్చి వారలనిద్దరిని ఉస్మానియా దవాఖానకుపంపిరి. కాని ప్రయోజనములేక తెల్లవారి ౬గంటలకేభార్యమరణించెను, శవమునుతీసుకవచ్చి అగ్నిసంస్కారముగావించిరి. గుప్తగారిని మరునాడుసాయంత్రము ఇంటికితెచ్చిఅదేరోజురాత్రి ౧౧గంటలకు శికింద్రాబాదుదవాఖానాకు గొనిపోయిరి. కాని ప్రయోజనములేకఆదేరాత్రి ౨గంటలకుఆతడునుమరణించెను. భార్యాభర్తలను ఒకేస్థలమున అగ్నిసంస్కారముగావించిరి వీరుమార్వాడీఅగ్రకులజులు యువకులుఉత్సాహపురుషులు దాదాపు౨౦-౨౨ సంవత్సరములప్రాయమునసె వారు హిందీయందు పాండిత్యముగడించి అగ్రసేవాదళమునకు మంత్రిగపనిచేయుచు "ప్రేమకాట" అనుపుస్తకమును వ్రాసి ముద్రింపించి రెండవపుస్తకమునుగూడవ్రాసి దానినిగూడ ముద్రింపించుటకు సిద్ధముగాయుండిరి, ఇంతలోవారికిట్టి అకాలమరణము ప్రాప్తించెను. వారియాత్మకుపరమాత్ముడు శాంతినిప్రసాదించుగాక!

---

## సర్ అక్బర్ హైదరీగారు

హైదరాబాదు (దక్కను), మార్చి ౨౨

రాజ్యాంగ వ్యవహారముల కార్యదర్శితో రై. ఆ సర్ అక్బర్ హైదరీగారు నేటిపవదయం ఢిల్లీనుండి ఇక్కడికి చేరుకొనిరి.

---

#### పోయినఆస్తుల రాబట్టుకొనుట

బ్రిటిషు యిండియావారు తీసికొనినఆస్తులవిషయంలో సంస్థానాలకు పూర్వముండినహక్కులను నిల్పుకొనుటకై స్థాయిసంఘమువారు యత్నించుచున్నారని ఛాన్సెలరుగారు తెలిపిరి.

---

# కాంగ్రెసుసత్యాగ్రహ విశేషాలు

## డాక్టర్ పట్టాభిగారి అరెస్టు

డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారు భారతదేశరక్షణనియమావళిలోని ౨౬వదప ప్రకారం మార్చి ౧౯వ తేది రాత్రి అరెస్టు చేయబడి వేలూరికి గొనిపోబడిరి.

#### అనుమతి చిహ్నాలు

ఇకమీదట సత్యాగ్రహముచేయుటకు అనుమతించబడినవారలకు బీహారురాష్ట్రకాంగ్రెసు సంఘమువారు గుర్తుగా బాడ్జీలుఇచ్చెదరని తెలియుచున్నది.

#### సత్యాగ్రహిని పరిచయముచేసినందుకు అరెస్టు

గూడూరులో మార్చి౧౬వ తేదిన ఏ. సుబ్బరామిరెడ్డిగారు మూడవసారిసత్యాగ్రహముచేసిరి వారినరెస్టుచేయలేదు. కానిఆసమయంలోవారిని ప్రజలకుపరిచయంచేసిన జి. వీరబ్రహ్మణ్యంగారిని అరెస్టుచేసినారు.

#### ప్యారీలాలుగారి అరెస్టు

గాంధీమహాత్ముని కార్యదర్శులలో నొకరగు ప్యారీలాలుగారు మార్చి౧౮వ తేదిన రెండవసారి సత్యాగ్రహముజేసిరి, వారుఅరెస్టుజేయబడిరి.

#### అరెస్టుచేయనందువల్ల నిర్మాణకార్యక్రమ ప్రచారము

మదరాసురాష్ట్రములోని గుంటూరుజిల్లాలో మాళిపూడిగ్రామస్థుడగు పాతూరి వెంకటేశ్వర్లుగారు మార్చి౧౭వ తేదిన సత్యాగ్రహంజేసిరి. వారినిఅరెస్టుజేయనందువల్ల వారునిర్మాణకార్యక్రమ ప్రచారముజేయుచున్నారు.

#### సత్యాగ్రహముచేసెనను అసత్యాభియోగము

మదరాసురాష్ట్రపు నెల్లూరుజిల్లా కోవూరు తాలూకాలో మోదేగుంట కాపురస్థుడగు పోలునాయుడుగారు యుద్ధవ్యతిరేక కేకలువేసినట్లు నేరముమోపి కావలిసబ్ డివిజనల్ మేజిస్ట్రేటు ఆరునెలల కారాగారవాసశిక్ష, రూ౫౦ల జుర్మానావిధించిరి, దీనిపైపోలునాయుడుగారు జిల్లాసెషన్సుకోర్టులో మొరాఘాచేసికొనగా మోదేగుంటగ్రామమున్సిఫునకు తనకునువిరోధముండుటవల్ల తనపైపగదీర్చుకొనుటకై అమున్సిఫు ఈ అసత్యపునేరముమోపి పోలీసువారికి తెలియజేసినట్లువాదించుకొనెను. సెషన్సు న్యాయాధికారి "గ్రామమున్సిఫుమోపిననేరంలోకంటె మరొకదారునిమాటలలో సత్యంయున్నట్లుకనిపించుచున్నది" అనితీర్పుచేసి పోలునాయుడుగారిపై అభియోగమును కొట్టివేసిరి.

#### జుర్మానాలు, ఆహారముగురించి గాంధిగారి సలహాలు

అఖిలభారతకాంగ్రెసు పరిషత్తుకార్యాలయ కార్యదర్శి సత్యాగ్రహులకు విధించుజుర్మానాలనుగురించి గాంధిమహాత్ముని ఆజ్ఞలను వివరణచేయుచు పుణాలియా జిల్లాకాంగ్రెసు సంఘసభ్యునికొకనికి ఇట్లుతెలియజేసిరి. "జుర్మానాలను చెల్లించుటకు సిద్ధంగాలేనిఆస్తులుగలవారెవరును సత్యాగ్రహంలోచేరనక్కరలేదు. అయితేఆస్తిని బంధువులపేరపెట్టవచ్చును." అజిల్లా కాంగ్రెసు సంఘానికి వ్రాసినమరొకలేఖలో అఖిలభారత కాంగ్రెసుపరిషత్తుకార్యదర్శిగారిట్లుతెలిపిరి, "అరెస్టుకానిసత్యాగ్రహి అన్నమడుగుకొనవచ్చును. కానిఅతనివద్దడబ్బున్నచో అడబ్బుతోఆహారముకొనవచ్చును. ఏగ్రామంలోగాని ఆహారముదొరకనిచో ముందుకుసాగిపోవుటయేమంచిది. ఒకసారి సత్యాగ్రహముచేయుటకు అనుమతించబడినవారు మరలగాంధిగారి అనుమతిపొందవలసినఅవసరము లేదు. సత్యాగ్రహులు జట్లుజట్లునడువక ఒక్కొక్కరుగానేనడచిపోవలెను, స్త్రీసత్యాగ్రహులు సమీపమైనంతవరకు ఇక్లేచేయవలెను,

#### కె. యం. మున్షీగారివిడుదల

పూర్వము బొంబాయిరాష్ట్రమునకు కాంగ్రెసుమంత్రివర్గంలో హోంమంత్రిగనుండిన కె. యం. మున్షీగారు యుద్ధవ్యతిరేక సత్యాగ్రహంచేయదలచి ప్రభుత్వాధికారులకు తెలుపగా అరెస్టుచేయబడి జైలులోనుంచబడిరి, ఇప్పుడువారిఆరోగ్యస్థితిబాగులేనందున వారువిడుదలచేయబడినారు వారిభార్యకూడా యుద్ధవ్యతిరేకసత్యాగ్రహానికై జెయిలులో శిక్షననుభవించుచుండెను. ఆమెభర్తవద్దకుపోవుటకు పోలీసువారి కాపలాలో సెలవుదలకోరినందువల్ల ఆమెను విడదలచేసినారు. ఇప్పుడుమున్షీగారి ఆరోగ్యము చక్కబడుచున్నట్లు మార్చి ౨౦వతేదినాటివార్తలచే తెలిసినది.

#### కేరళరాష్ట్రపు లెక్కలు

కేరళరాష్ట్రంలో ఈమార్చినెల ౧౫వతేదినాటికి ౬౧ మంది సత్యాగ్రహులు అరెస్టుచేయబడినారు. ౩౨ మంది సత్యాగ్రహులు అరెస్టుచేయబడకవదలివేయబడినారు,

#### సింధురాష్ట్రకాంగ్రెసు ఆతురము

సింధురాష్ట్రంలో అశాంతియుండుటవల్ల కాంగ్రెసువారలు సత్యాగ్రహంచేయరాదని గాంధిమహాత్ముడువిధించిన నిషేధాజ్ఞనుతొలగింపజేసుకొనుటకై ఇపుడు సింధురాష్ట్ర కాంగ్రెసుసంఘమువారు యత్నించుచున్నారు.

#### ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసంఘ కార్యాలయపుసోదా

మదరాసునగరపు పోలీసులు అక్కడిఆంధ్రరాష్ట్రకాంగ్రెసు సంఘకార్యాలయమును, ఆంధ్రజిల్లాకాంగ్రెసు సంఘకార్యాలయమును ఒకగంటసేపు సోదాజేసి,, కొన్నిరికార్డులను, ఒక సైక్లోస్టైలుమిషీనును, రెండుటైపురైటరులుపట్టుకొనిపోయిరి.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసంఘ కార్యదర్శి కళావెంకటరావుగారు ౨౦వ తేది ఉదయం అమలాపురంలోఅరెస్టుచేయబడి మదరాసునకుగొనిపోబడిరి వారుసత్యాగ్రహాజ్ఞలను జారీచేసినందుకై ౬నెలలకఠినశిక్ష విధించబడినది.

---



Printed and Published by, G Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad Dn. Editor S. Prathapa Reddy B. A B.L.